# వీర

# బ్రహ్మంగారి చరిత్ర

(బుర్రకథ)



గ్రంథకర్త:
నాగశ్రీ

పబ్లిషర్సు:
కురుకూరి సుబ్బారావు సన్
ప్రొప్రయిటరు: సరస్వతీ బుక్ డిపో
రైల్వేబుక్‌స్టాల్సు; పవరుపేట, తాడేపల్లిగూడెం,
విజయవాడ
1957.

[0—8—0

సర్వహక్కులు పబ్లిషర్సువి } 1957 సం॥ 2000 కాపీలు { 0—8—0



## బాలసాహిత్యము

| బుర్రకథలు : | కథలు : |
|---|---|
| బ్రహ్మంగారి చరిత్ర | మాయామందిరము |
| ష్ణరాయబారము | బలే సంగీతము |
| పల్నాటియుద్ధం | సింహసేనుడు |
| భగవద్గీత | అన్నదమ్ములు |
| రుద్రమదేవి | పక్షుల స్నేహం |



ఓం:

శ్రీ వీరబ్రహ్మయోగి సంపూర్ణ జీవితచరిత్రము.

# బుర్రకథ

## విజయవాదం

జయము జయము శ్రీ గోవిందమాంబకు జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ సిద్ధునమూర్తికి జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ జీవసమాధికి జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ సిద్ధయయోగికి జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ భారతమాతకు జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ సర్వజగాలకు జయము దిగ్విజయము;
జయము జయము శ్రీ సభాసదులకు జయము దిగ్విజయము;
జయము జయము మననాగశ్రీ కవికి జయము దిగ్విజయము

వంతగాడు:— వచనం॥ ఓగోయ్! జయము జయమంటూ గందరగోళం చేయటమేనా ? కథేమయినా చెప్పేదున్నదా ?

కథకుడు:— వ॥ అదికాదురా ! శుభప్రదమైన జయమును దెలిపి పిదప కథారంభమును చేయుచున్నానురా !

వం:— వ॥ అలాగేం ? అయితే నీవు చెప్పేకథేమిటో ముందు చెప్పు.

కథ:— వ॥ నేను చెప్పబోయేకథ బుర్రకథరా నా తంత్రీ! బుర్రకథ..

సం:_ వ॥ అదిసరేలేవోయ్! నీ బుజానయున్న పెద్ద గుమ్మడికాయంత బుఱ్ఱా, తలపాగా; బొటనవ్రేలి ఉంగరం. నీకు రెండువైపులానున్న శ్రావణ భాద్రపదాలం మేమిద్దరము. మా మెడలలోని యీ గుమ్మటలు చూస్తే బుఱ్ఱకథను కొనకపోతే హరికథనుకొంటారా? నీ తలకాయ కథను కొంటారా? ఆకథ యెవరికథ—? ఆకథలోని ప్రధానమయిన విషయమేమిటి అని అడుగుతున్నాను.

కథ:_ అలాగా? అయితే వినుమరి—

సీ॥ కందిమల్లయ పురమందు_జీవసమాధి
జెందిన ప్రఖ్యాత సిద్ధయోగి;
యేనాడో జరుగ బోవునదెల్ల ముందుగ
లిఖియించి చెప్పిన లెక్కగాడు;
దారాసుతులుగల్గి తత్తపస్వియగుచు
ప్రజల మెప్పించిన ప్రజ్ఞశాలి;
అంటరాని తనము నరికట్ట _ కక్కని
పంచకేగిన మేటి పంతులయ్య;
గీ॥ ఆలపఠానుల ఘోరకృత్యములనుండి
స్వీయ మతము నిల్పిన రాచకీయవేత్త;
వీరగురుచంద్రుడతని జీవితచరిత్ర
వినుడు జనులార! ముదంబుగనుడు _ నేడు

సం:_ వ॥ అయితే యిప్పుడు నీవుచెప్పేది శ్రీ మద్విరాట్పో తులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి చరిత్రయున్నమాట_ అంతేనా?

కథ:_ వ॥ అవునవును.

హిందూ దేశమునందునా _ సై
నందికొండ పురంబునా _ సై
పొందుగ పాపఘ్నిపీఠమునా _ సై
విందుము వీరభోజు డనా _ భళాభళానోయి తమ్ముడా
మేలుభళానోయి దాదానా॥

వ॥ పాపఘ్ని పీఠాధిపతులయిన వీరభోజమహాచార్య స్వాములవారు సంతానము లేనికారణమున తన ధర్మపత్ని యగు వీరపాపమ్మతోగూడా దివ్యక్షేత్రముల సందర్శించుచు నత్రిమునీంద్రుని యాశ్రమమునకురాగ...

సం:- (అడ్డువచ్చి) వ॥ ఉండండు. నాకు బలే సందేహం వచ్చింది.

సహాయకుడు:- వ॥ ఏమిట్రా నీ సందేహం?

సం:- వ॥ ఏమిటా? అత్రిముని యాశ్రమమన్నావే?_ అసలీ బ్రహ్మంగారెప్పటి వారైయుంటారురా?

సహా:_ వ॥ రమారమి నాలుగువందల సంవత్సరముల నాటివారై యుంటారని భావించవలయును. ఎలాగంటే?_ బ్రహ్మంగారు కన్నాలు నవాబు; సిద్ధవటంనవాబు, కడప

నవాబుల వద్దకుపోయి పూజలందినట్లు చరిత్రాధారములున్నవి. అందులకు ప్రథమ నిదర్శనముగ కందిమల్లయ్యపల్లెలో శ్రీస్వాములవారి మఠమునకు నవాబులవారి కానుకలు యీనాటికిని వచ్చుచుండుట మనముస్వయముగ చూడవచ్చును. నవాబుల ప్రభుత్వము క్రీస్తుశకము పదునాల్గవ శతాబ్దమున ప్రబలి యుండుటచే బ్రహ్మముగారు దాదాపయిదువందలేళ్ళనాటి వారని నిర్ణయించవలయును.

వం:— వ॥ మరి—అత్రిముని అన్నావే?—యీ అత్రి అప్పుడురాడే: అరుంధతీ పతియైన అత్రియేనా? లేక యీ పత్రి యింకో ఆసుపత్రా?

సహా:— వ॥ ఓరివెధవా! ఆ అత్రి యెప్పుడో యుగములనాటివాడు. ఈ అత్రి అయిదువందల సంవత్సరములనాటివాడు. ఈ అత్రి ఆయత్రికాదు. అత్రియని పేరుగల మరొక ముని. అంతే.

వం:— వ॥ అయితే, సరే. ఇకనీ కథచెప్పు వింటాం. స్వా.

కథ:— వం॥ అప్పుడా అత్రి వీరభోజయాచార్యులవారి విచారమెరింగి అంతదనుక తను పెంచుచున్న నాపమాంసముల బాలునివారికొసంగి.

ఉ॥ ఇంతటి శంకలేల వినుడీ విషయంబును మీరుమున్న వే
బాంతులు విశ్వకర్మకుల దంపతులేగి – సరస్వతీ నదీ
ప్రాంతము నందు నీసుతున భాగ్యతగాంచి గతించువేళ
నా చెంతకు దీసి పెంచితిని, చేగొను డీతని మీరు
దత్తుగాన్.

వః అని వచించిన అత్రికినమస్కరించి యా భార్యాభర్తలా బాలుని తమ యింటికి గొంపోయి శుభసమయంబున నఖిల బంధుమిత్ర పరివారాదుల రావించి, వారందరి సముఖంబున నా బాలునకు వేదోక్తక్రమంబుతో "వీరప్పయ్య" యను నామ కరణముచేసి_ పిదప నైదేళ్ళనాడుకాక విద్యాభ్యాసమున కనిపిన నా బాలకుండు.

ఓం నమశివాయ లోకపూటనే_ సై.
అక్షరంబుల నైదుబళ్ళును _ సై.
సకల విద్యల సారమెల్లను _ సై.
చూచి గ్రహించెను. సూక్ష్మముతో భళాభళానోయి
తమ్ముడా! మేలుభళానోయి దాదానా.

వః ఇవ్విధంబుగ నతండు సర్వవిద్యల నభ్యసించెను.

వః తరువాత వీరభోజయాచార్యస్వాముల వారా వీరప్పయాచార్యులవారికి వైదికక్రియాధికారముగ నుపనయనంబు గావించిన కొంతకాలమునకు లింగైక్యమునందిరి. వీరాచార్యులు తండ్రిగారి యంత్యక్రియలు పూర్తిగావించి, దేశయాటనకేగు సంకల్పమున మాతృసెలవునర్థింప నా వీరపాపమాంబ విచారముతో

సంతానములేక మానసమందున సంతాపము నొంది;
కాంతుని తోడుతనేగితి పుణ్యుల గాంచగ శ్రమనొంది;
అంతట జేరితి మత్రిమునీంద్రుని యాశ్రమమెరుగంది
సంతోషంబున దత్తుతనయుగ చయ్యననిను జెంది;

అంతటికి నానింతగ నిను జేసితి మాత్మలో భ్రమలందిః
పంతముతో మము విడ నీ కేటికి పట్టెను కడురంధి.

వ॥ ఇంకనూ చింతిలుచున్న తల్లికి విరక్తిని బోధించ వలయునని పిసప్పయ్యగారు తిరిగి అమ్మా! నీవు సంసార భ్రాంతిని వీడలేదా; అనులయిన నా హిత మాలకింపుమా.

సీ॥ భాగ్యశాలి కథక సౌఖ్య వసతిలేదు;
కటికి పేదకునో కేమి కానబడదు;
పోకతప్పదెవరి కేమి పోయివులేదు;
రూపి మన కందరకు నొక్క రుద్రభూమి.
(కవిగారి ప్రత్యేక రచననుంచి సేకరణ)

వ॥ అని తెలిపి మరియు అమ్మా! అదియునుగాక నా వంశము ముందెక ప్రపంచము మీధ నిలుపడమ్మా!

సహా :- వ॥ అయితే మనవంశ మంతరించి పోవల దటరా నాయనా?

కథ:- వ॥ అవునమ్మా!

సీ॥ ఏను, నాసుతులు, మనుమలేమొగాని
వసుధ నాదువంశంబు నిర్వంశమగును;
పుత్రికాసంతతియె వృద్ధిపొందు నిజము.
యెంత చింతించినా యిది యిలతెనమ్మ!

వ॥ అనుచు తల్లి కనేకవిధంబుల సమాధానములు చెప్పి, తుద కంగీకరింప జేసి; ఆయనగారు యింటినుండి బయలు దేరి తీర్థక్షేత్రంబుల వరుసగ దర్శించుకొనుచు.

శ్రీరంగమును చూచెరా _ సై
చిదంబరమును చూచెరా _ సై
మధురాపురమును చూచెరా _ సై
కుంభకోణమును చూచెరా _ భళాభళానోయి
తమ్ముడా మేలుభళానోయి దాదానా॥

కాశీపురమును చూచెరా _ సై
రామేశ్వరమును చూచెరా _ సై
వరుసగ తీర్థాలు చూచెరా _ సై
హరిహరపురమును చేరగా భళాభళానోయితమ్ముడా
మేలుభళానోయి దాదాన॥

వ॥ అవ్విధంబున వీరప్పయ్య హరిహరపురంబునకు జేరి అచట తపంబాచరించుకొనుచున్న నొకనాడు ఆనంద భైరవ యోగి వచ్చి వారిపాదంబులపయి వ్రాలి.

ఘనముగ కాశీపట్నము నేలెడు భూపతినేనండి.
అనువుగ నానందభైరవయోగి నందురు నన్నండి.
పనివడి వేటాడ నొకదినంబున వనములకేతెంచి
కనులార ఘోరకృత్యము నొక్కటి గ్రక్కున నేగాంచి
ఆకలిదీర జలముగ్రోలగ నా యావు మెడవంచె
పైకురికి దాని జంపగ నుంకెను వ్యాఘ్రము హా మది పొంచి.
గోవును రక్షించి పులిని వేగంబె గూల్పగ నే గోరి
శివిగ విడిచిన బాణమున గూలె ధేనువెగురిజారి
కుయ్యో. మొఱ్ఱోయనుచా ... గూలెను ధరపైన

అయ్యో. గోహత్యా పాతకంబు లంటెగద నా కద్దాన.
హరిహరీ పాపనేవిధమున హరియించునో యయ్యో!
కరుణతో నా దోషముబాపి కాపాడుబాబయ్యా!

వ॥ అని ఆనందభైరవయోగి ప్రార్థింపగ వీరప్పయాచార్య పతనిని చూచి "నాయనా" ఆనందభైరవయోగీ! విచారపడకు, ఇదంతయు దేవకార్యము. నీవి గోహత్యా నేరమునకు ప్రతిఫలంబుగ ముందు మానవులలో దూదేకుల నారింట నాదంబీ పీరు సాహెబులకు కుమారుడవై జన్మింపుము.

సహ:_ వ॥ నేనా? దూదేకులవారింట?—అంతే మహమ్మదీయులలో?

కథ:- వ॥ అవును నాయనా! ఏమి నీ సందేహం?

సహ:_ వ॥ ఏమీలేదు స్వామి! ఒక అబద్ధాన్ని కాపాడుకోటానికి నూరబద్ధాలాడాలి. అలాగే యీజన్మలో తెలియక ఒక గోహత్యచేశాను. ముందుజన్మలో తెలిసి అనేక గోహత్యలు చేయటానికా స్వామి మహమ్మదీయులలో పుట్ట మన్నారు.

కథ:_ అదా, నీ సందేహం. అలాచెప్పిన కారణము దేవరహస్యము. నీకు చెప్పుచున్నాను. చాలశ్రద్ధగ వినాలి సుమా.

భారత దేశం మనదిరా – సై
భారత శీలం మనదిరా – సై

భారతస్వాతంత్ర్యం మనదిరా – సై
భారత ప్రజలు మనమేరా భళాభళానోయి తమ్ముడా!
మేలుభళానోయి దాదాన.

వ॥ మనకింకను జైన, బౌద్ధ, మహమ్మదీయాది యితర మతము లున్నవి. వీరిలో యిప్పుడు మహమ్మదీయులు రాజు లగుట బలవంతులై యుండిరి. వారేమి భావిస్తున్నారట? ఆ మతమును ప్రబలంచేస్తే అల్లా సంతోషించుతాడని నమ్మినవారై హిందువులను వారి మతములో చేరమని నిర్బంధించు చున్నారు. ఎలాగంటే–?

కరకు కత్తులతో నాల గొంతులు కరకరకోసిరీ సై॥
సురాలయములను మసీదులుగాగ చౌరవడి చేసిరీ
కన్నియలు కంటబడిన వెంటను గైకొనిపోయిరీ
తన్నుకొనిన గుంజుకొనినను గాని దయజూడ రయిరీ
బొట్టుకు పన్నూ జుట్టుకు పన్నూ పూర్తిగబెట్టిరీ
గట్టిగపన్నులు గట్టనివారల కట్టియు గొట్టిరీ.

వం:– వ॥ అరేయ్! జుట్టుపెట్టుకొన్నా, బొట్టుపెట్టుకొన్నా ప్రభుత్వం పన్నుగట్టమన్నదటరా? అదేమిటిరా? ఇంటికి పన్ను, పొలానికి పన్నూ, యింకా దేనికన్నా పన్నంటే పరవాలేదు కాని – యిదేందిరా యీచిత్తరం. నాకేం నచ్చలేదురా!

సహా:– వ॥ అంటే ఖురానుమతంలో జుట్టుబొట్టులు లేవు. అపుడు రాజులు సాహెబులు కాబట్టి వారిరాజ్యాలలో

బొట్టుకు బొట్టుకు పన్నులు విధిస్తే కట్టలేనివారు వాటిని తీసి వేస్తారు. అప్పుడు వీరందరూ మహమ్మదీయమతంలో చేరినట్లుగ అల్లా మెచ్చుతాడని తలంచారు.

కథ:_ వ|| కాబట్టి నాయనా! ఆనందభైరవయోగీ! నీవా మతములోబుట్టి ముందునాకు శిష్యుడవుకమ్ము. నీనలన నేను తురుష్కరాజులకును జ్ఞానోపదేశముగావించి సర్వమత సమత్వమును చాటెదనని వానికించెప్పి పంపించిన పిదప వీర ప్పయాచార్యులవారు కర్నూలు తాలూకాలోని బనగాను పల్లెలో అచ్చమ్మగారి ఆవులగాచుచు కొంతకాలంబు జరుగగ తోడి బాలురొకనాడు అచ్చమ్మతో.

అమ్మ అచ్చమ్మా తల్లీ నీవు ఆలింపు మామాట.
బెమ్మయ్య సేసేతంతు సూడంగ రమ్మమ్మ యీపూట
నీళ్లూమేతా లేకుండా మంద నిలుసుండె గిరిలోన
వెళ్ళినబాటనె తిరిగివస్తుందిగ వేగ ప్రతిదినాన
కల్లలుసెప్ప మాకేమి ఫలమూ కలుగబోదు వినుమూ
సల్లంగ నీవేవచ్చి యీ దినమున సత్యమెల్ల కనుమూ.

వ|| అనిచెప్పిరి యీ విధంబున చాలాదినములనుండి చెప్పుచుండినందున అచ్చమ్మ వెంకటరెడ్డిగారలిద్దరు అయినా చూతమని యీ బాలురవెంట వెళ్ళినవారు కాబట్టి చాటుగ దాగుచు పోయి వీరప్పయ్యగారి చర్యలు గమనించుచున్నారు.

వీరప్ప ముందుగచని తాగిరి పెద్దదిగా గీచి
చేరిక గోమందను గిరిలోనికిచేరిచి తావెచి

రెక్కలకొండ కల్లంత దూరముగ రయమున తానేగి
ముక్కలతని కందింపగ వాడియు మ్రొక్కి నెదుట వేగ
అంతట తాళపత్రంబులు గోసుక సతడేగె సహజాన
వింతగ నాతాడిలేచి నిలుచుండె వెనుకటిచందాన
అదిగని యచ్చమాంబిక మదిలో సంబ్రమును చెంది
పోదిగిపోదిగి వానిచర్యలగాంచెను వొప్పుగముదమంది

వ॥ ఆ సమయంబున కాలజ్ఞానము వ్రాసికొనుచు మహాతేజస్వరూపివై ప్రకాశించుచున్న వీరప్పయ్యనుచూచి యాతని మహాత్మునిగ భావించి వెనుకసుకొని బ్రహ్మముగా రున్న లోయనుండి వెలుపలకువచ్చి వేంకటరెడ్డితో "నాథా! ఇతండు మహానుభావుడు, మాకు త్వరితముగవెళ్లి మంగళ వాయిద్యంబుల గొనివచ్చిన (శ్రీ)రాములవారిని మేళతాళము లతో యింటికి గొంపోవుదమనిదెల్పి, తన మనంబున నాతీర వప్పయ్య సాక్షాత్ కృష్ణావతారంబని పొల్చుకొన మొదలిడెను.

* సీ॥ ముద్దుకృష్ణుడు నాడు మురళి వాయించు వ్రే
పల్లె యీబనగాను పల్లెగాగ;
చల్దిమూటలు గట్టిసాగి కృష్ణునిబంపి
నట్టి యశోద అచ్చమ్మగాగ;
సంతోష మింపొంద చల్దిభుజించెడు
గోపాలురీ రెడ్డిగుంపుగాగ;
గ్రాంతంబులకు నెంతో సంతసంబొనగూర్చు
నల్లకృష్ణుండు వీరప్పగాగ;

సీ॥ పార్థునకు హరిచెప్పిన భవ్యగీత
వసుధ నీతడు వ్రాయుకావ్యంబుగాఁగ;
తప్పిపోదు-నామాట వ్యర్థంబుగాదు
నేటికైనను-ముందొక్కనాటికైన.

(కవిగారి ప్రత్యేకరచన నుండి సంగ్రహణ)

వ॥ అని పొల్చుకొనుచుండ వెంకటరెడ్డి మంగళవాద్యంబులతో యింటినుండి మరలివచ్చుసరికి వీరప్పయ్యాయు నా కొండబిళ్వంబునుండి బైటకువచ్చుటచే నాదంపతులు వారికి మ్రొక్కి పాదపూజ గావించుచుండ నాతడేమియు తెలియని యమాయకునివలె.

ఉ॥ బాలుడు; మీకు పుత్రసమభావుడ; దీనుడ పేదవాఁడ;
గోపాలుడ నిట్టి నన్ను భగవానుని లీల నుతింపఁజెల్లునే;
యేలిక లైనమీర లిట్టులేల చరించెదరమ్మ! వందనం
బేల? సుమంబులేల? జలమేల? విధేయత లేల చెప్పుమా!

(కవిగారి, ప్రత్యేక రచననుండి సేకరణ)

అని వచించిన స్వాములవారిని సాక్షాత్ విష్ణుస్వరూపునిగ భావించుటచే నచ్చమాంబిక తిరిగి వానితో.

సీ॥ బాలుడవై కాదె బలిచక్రవర్తిని
పాతాళమున కంపి బరగినావు!
బాలుడవై కాదె పాపి దైత్యులగూల్చి
గాధేయ యాగంబుగాచినావు!
బాలుడవై కాదె బ్రహ్మాండమును నోట

సుదతి యశోదకు జూపినావు!
బాలుడవై కాదే; యాలమందలగాయ
వచ్చి మాయింటను జొచ్చినావు!
సీ॥ బాలుని విధానదోచు నీ లీలలెన్న
తరములే దేవ మాకెన్ని తరములైన
నేరములన్నెంచి మమ్ము మన్నింపుమయ్య!
బాలరూపంబు నందున్న భక్తపాల!

వ॥ అని ప్రార్థించి వైభవంబుగ వారిని యింటికి గొనిపోయిన తరువాత మహాత్ములనూచి బ్రహ్మంగారు సాక్షాత్ భగవత్స్వరూపులని విశ్వసించిన అచ్చమ్మగారాయన కొక మఠంబును గట్టించిరి.

అలావుంటూవుండగ నొకనాడు అన్నాజయ్య యను విప్రబాలకుడా స్వాములవారిని దర్శించటానికిరాగా 'స్వాములవారాతనిని దగ్గరకు దీసికొని. నాయనా! అన్నాజీ!

పాపములభరింపలేని భూసతి ప్రముదమునొందగ
నీపగిది త్రిమూర్తులము జనియించి నిలపైన ముందుగ
పుడమిని బ్రహ్మమునైబుట్టి నే పుండరీకాక్షుండ
ముడుమూలలోన సిద్ధావతారుడై పుట్టు మహేశుండు;
అల చతురాస్యుడ నీవు జనించితి వన్నాజియనంగ
తొలిజన్మల వృత్తాంతము దెల్పితి తొలుత నీవువినంగ.

వ॥ అనిచెప్పి మరియు అన్నాజీ! మద్గురుమూర్తియైన వీరభద్ర విగ్రహంబొండు నిర్మింప నుంటిని. అదికాలక్రమంబున

నదీప్రవాహమునబడి, అల్లాడుపల్లెకు జేరి, యూరివెలుపల కోనేటిలో నివసించుచు కొన్ని మహత్వంబులను చూప నా యూరివారచట వీరభద్రాలయము నిర్మించి, అందా విగ్రహమును ప్రతిష్ఠచేయుదురు. నీవు బనగానుపల్లెలో కొద్దికాలముండి, తరువాత అల్లాడుపల్లెలో వీరభద్రాలయమునకు పొమ్మని దెలిపి. శ్రీస్వాములవారు ప్రయాణమునుండగ నచటి భక్తులందరు "స్వామీ! మీరు వ్రాసిన కాలజ్ఞానమును మాకు వినిపింపుడని కోర వారలకు కొన్ని విషయంబు లీరీతిగ వినిపించుచున్నారు. ఇకముందీ కలికాలంబున—

గురువులు నామాలుబెట్టి శిష్యులు కొల్లగ బుడతారు.
గురుల నెంచక వర్తిలువారలు వసుధలో పెరుగుతారు.
పరాలకు మంచము బాపలకు పీట మరిమరి వేస్తారు
కొలుపోత్రాలపైయుల్లో పూనని గర్జనలు చేస్తారు.
కల్ల నిజమౌతుంది, నిజముకల్లయ్యే కలిమార్పువస్తుంది
తల్లి విషంబుగ పెళ్ళాము బెల్లము తలకిందుచేస్తుంది
మంచినీటికి కొరతే వెలుగుతూ మురబండి వస్తుంది.
మూకకు చిట్టెడు నూకలు చాటుగ లోకానికిస్తారు.
కాకాలురాని దద్దమ్మలెందరో గణుతికి వస్తారు.

వం:— (పాడకుండా వూరుకుంటాడు.)

సహా:— వ॥ ఒరేయ్ మాట్లాడవేమిరా ?

వం:— వ॥ యిలాంటి అబద్ధాలు నేను వినను. మన యిండ్లముందు బైరాగులు పాడుకొంటూవచ్చే వేగా నీవు

చెప్పేది? మొన్న మావూరికో పెద్దసిద్ధాంతివసుకొంటూ వచ్చాడు. ఆయనగారు నీ మాదిరే బ్రహ్మంగారి కాలజ్ఞానం అని పురాణం సెబుతూంటే, మా వూళ్లో వాళ్లంతా యింకేం సుకుతె—పప్పుభోజనాలు—పిండివంటలు—రూపాయలు ఆయన మొఖానపెట్టారు. ఆయన పురాణంలో సెప్పాడుగదా, మొన్నపోయిన పందొమ్మిదివందల నలభైయేడో సంవత్సరం ఆగష్టునెల పదిహేనో తారీఖునాడు యీ ప్రపంచం అంతా తిరగబడి పోతుందని, అది బ్రహ్మంగారే సెప్పారని సెప్పాడు. మేమంతా బయపడ్డాం. నా మట్టుకు నేనా రోజంతా దడుస్తునేవున్నా. నిద్దరపోయి లేచేటప్పటికి యేంజరుగుతుందో ననుకొన్నా. తెల్లవారింది—ఏముంది? బాబూ! యిలాంటిబద్ధాలికమీద చెప్పావంటే నీవ్వూ, మేము మళ్లీ యింటికి పోకుండా యీజనమంతా మసనోటి పచ్చ్యాలుతీరతారు.

సహా:— ఓరీ, సన్నాసీ! నీ కందులో రహస్యం తెలియులేదు. అసలా బ్రహ్మంగారి వాక్యాలలో అబద్ధంలేదు. మాఘా కార్తీక బహుళ అమావాస్య మధ్యాహ్నం షన్నెండుగంటల మూడునిమిషాల అయిదు విఘడియలకు, ముప్పాతికామువ్వీసం సూర్యగ్రహణం అని పంచాగాలు వ్రాస్తే అలాగే యెందుకు జరుగుతున్నాయి? అలాగే ప్రపంచభవిష్యత్తును దెలిపే గణి శాస్త్రం బ్రహ్మంగారిది. స్వాములవారు రచించిన ఆపదునాల్గు వేల కాలజ్ఞాన సూత్రాలున్న తాళపత్రమును అచ్చమ్మ గారింట నొక పాతరతీయించి, దానిలో యీ కావ్యముల నుంచి మూసిసపిమ్మట స్వాములవారా పాతరమీదొక చింత

చెట్టు మొలచుననియు. దానికాయలన్నీ కాటుకబట్టి యుండుననియు, లోకములో ఉత్పాదములు పుట్టుటకుముందా చెట్టు కొమ్మలమధ్య రక్తస్రావము గలుగుననియు చెప్పినారు. అట్లే మొలచినచెట్టును నిదర్శనముగ మన మీనాటికీ బనగానపల్లెలో చూచుచున్నాము. ఆచింతచెట్టు క్రిందనున్న కాలజ్ఞానంబుల నెవరునూ బయటకు తీసినవారు లేరు. చరిత్రాధారము లంతకంటెను లేవు. అటువంటప్పుడు స్వాములవారి స్వహస్తముతో వ్రాసిన పుస్తకములు మనకెక్కడివి? అయితే వారిరచనలు నోటితో చెవిని వినిపించుచుండగ విని వ్రాసుకొనినవి ఆదికావ్యములు. వాటినిచూచి వ్రాసినవి యితరుల గ్రంథములైనవి. మధ్యవారి వ్రాతలలో జరిగిన పొరపాట్లను మనముగణించరాదు. ఇంతకుముందు నీవుచెప్పిన సిద్ధాంతి పొట్టకూటికై తనకు చిక్కిన తప్పుల పుస్తకమునుదెచ్చి స్వాములవారి పేరును కళంకపరిచినారు. అది సామాన్యులు గ్రహించలేకపోతున్నారు.

కథ:— వ॥ ఆ తరువాత అచ్చమ్మగారు జ్ఞానబోధ సేయుడని కోరగ స్వాములవారు "సంసారబంధములున్న నీకిచోట తగదని యాగంటిక్షేత్రమునకు గొంపోయి జ్ఞానబోధ గావించినపిదప నతండు కందిమల్లయ పల్లెలో వ్రతాంగముచేయుచుండ వాని మహాత్మ్యంబులు క్రమముగ లోకమున దెలియుచుండెను. ఆకాలమున పెదకొమెర్లపూడిలో శివకోటయాచార్యులను నొకసదాచార సంపన్నుడయిన విశ్వబ్రాహ్మణుండున్నాడు.

శివకోట యాచార్యులకు కుమారీ శీలసంపద మీరి
భువిగోవింద మాంబను పేరున పాలుపారు సుకుమారి
పదునాలుగేడ్ల ప్రాయంబుగాంచె బాలికా రత్నంబు
వెదకుచు పెద్దలు సేయుచు నుండిరి పెండ్లి ప్రయత్నంబు
సిరిసంపదలున్న సొగసుగాండ్రను చిన్నవారందరు
మురియుచునా సుందరి ప్రేమ మరిపొందలే దొక్కరు
వీరంభట్ల యాచార్యులునై ధాతి వెలసితాయున్నాడు
వారే నానాథులని గోవిందమ బలికె తానొకనాడు.

సహా:- వ॥ అమ్మా? గోవిందమ్మా; మనం చాలా ధనవంతులము. నాకునీవు నాకొక్కగా నొక్క గారాబు కుమారివి. దిక్కులేని వీరప్పయ్యను వివాహమాడితే యేం సుఖపడతావమ్మా?

కథ:- వ॥ నాన్నా! వారు సామ్యాలుగారు. మొన్న కందిమల్లయ్య పల్లెలో పోలేరమ్మ జాతరలపుడు చందా నివ్వని కారణమున వారిని పురపెద్దలు పిలిపించిరట. అంత స్వాములవారు పిలువగా పోలేరమ్మ స్వయముగా చుట్ట కాల్చుకొనుటకు నిప్పునిచ్చినదని చెప్పుకొనుట మీరు వినలేదా?—రాత్రింబగళ్లు వేదాంత గోష్టిలో నుండి పనిచేయువారు కారట తెల్లవారుసరికి రైతులకు కావలసిని పనిముట్లన్నియు పూర్తి తయారగుచున్న వన్నవింత మీకు మరచిపోయారా? నాన్నగారూ; వారు ముందు నాకలలో కనుపించారు. తరువాత మంచినీటి బావివద్ద చూచాను. నామనసులో వారే నిలిచిపోయారు. వారు సాక్షాత్ విష్ణు స్వరూ

పులు. అతనికి నన్నిచ్చి వివాహముశేయుటలో మీాననుమా నించకండి.

అని అడిగిన తరువాత శివకోటయార్యులు విధిలేక గోవిందమ్మను బ్రహ్మంగారికిచ్చి వివాహము గావించిరి. పిదప —

అమహనీయుడు గోవిందమతో హాయిగను గూడి,
మామయగారింటనే యుండెనపుడు మమతతో నడియాడి
ముందుగ వారికి బుట్టిన బిడ్డను ముద్దులు గులుకంగ
అందరిలో సిద్ధిలింగయ పేరిడి అందాలు చిలుకంగ
తనయులులేని మామ కాతనయు వత్తుగవియ మించి
వనితతోగూడ కందిమల్లయ పల్లెవాసమున చరించి.

అట్లా గోవిందమాంబా వీరంభట్ల య్యారుల వారు కంది పల్లెయ పల్లె యందాశ్రమము నిర్మించు కొనియుండిరి. సిద్ధలింగయ్యగారి తరువాత వారికి గోవిందయ్యా పోతులూ రయ్యా: గిరిరాజయ్యా ఓంకారయ్యా యనునలువురు కొమ రులును. వీరనారాయణమ్మయను కొమారియు గలిగిరి, ఇది యిటులుండ—

వినివిగ ముడుమాలయను పురంబున పింజారి కులమండీ!
సరసులు వారెంతో నారంబీ పీరుసాహెబులు గదండీ!
వారికి బుట్టిన యేకైకసుతుడా వసుధీలో సిద్ధుడు.
పేరూపెంపుల కెక్కిన చక్కని బిడ్డ ప్రసిద్ధుడు

వ! అవ్విధంబున సిద్దయ తోడిబాలురతో నాడు కొనక నొల్లక ఆనాటి ప్రహ్లాదునివలె నిరంతరము దైవభక్తి పరాయణుడై యుండ నొకనాడు అన్నాజయ్యావలన బ్రహ్మంగారి చరిత్ర విన్నవాడై శ్రీమద్విరాడ్విశ్వ కర్మ భగవానుడైన బ్రహ్మంగారి పాదసేవ సేయదలంచి యేతెంతునన వాని తలి తండ్రులు బంధువులు రోషాత్ములై.

అరరే యేమనిబలుకు చుంటివిర అజ్ఞానవశమున
పరమత గురువు సేవింప మనకు భాగ్యమంతయగునా?
అల్లా మనదైవము మన కుండగ నన్యమతములేల?
చల్లని ఖురానుని వీడిపోవుట జగతిని మేలా?
మక్కా మసీదులుండగ నింకొక మార్గము లెందుకూ?
యిక్కాలంబున రాజులు మనమే యికభయ మెందుకూ!

వ। అనియూటంక పరచిన సిద్ధయ్యగారు వినక కంది మల్లయ్య పల్లెకుబోయి బ్రహ్మంగారి పాదములందు సాష్టాంగ నమస్కారములుచేసి

శా॥కంటిన్ మామక నేత్రపర్వముగ లోకారాధ్యునిన్ నిన్నునే
నంటిన్ మత్ హృదయాబ్జసాక్షిగా మహాత్మాయంచు సేవింపగా
నుంటిన్ మంగళ పాదపద్మయుగ మందు తేజ మోహార్థినై
కొంటిన్ మీమధురైక నామరసమున్ గోవింద మాంబాపతీ

[కవిగారి ప్రత్యేక రచన నుండి సేకరణ]

వ॥ అని ధ్యానింప బ్రహ్మంగారాతనిని చేరబిలిచి నాయనా! ఎవరివినీవు? ఎందులకై వచ్చితివి?

సహా;- స్వామీ! నేనుముడుమాల నివాసిని గూడే ములసిద్ధుడను మీసేవసేయ గోరి వచ్చితిని.

కథ:- వ। నాసేవసేయ వచ్చితివా నాయనా?

సహా:[ వ। అవును స్వామీ!

కథ:- వ। సిద్దా:

మొగలాయి వంశసంజా తుండవు ముఖ్యము గానీవు
అగణితముగ మాశిష్యపథంబున ననుసరింపను లేవు
ధారుణి నేలెడువారు పఠానులు దర్పము గలవారు
భారత గురుసేవకు నీయందున పగబూన నగువారు
రాజులు గంగప్పలు మీవారలు రచ్చలో బెడతారు
తాజాగ పైబడి మమ్ముకొట్టగ తప్పులెతుకుతారు
మాకును నీకు సుఖంబులులేని మార్గము లింకేల
సాకులుబల్కక వింటికిబోవుట సౌఖ్యమగును చాల.

వ॥ అని బ్రహ్మముగారు దెల్పిన - సిద్దయ్య వినక శ్రీగురుదేవా! మహానుభావా! శ్రితజనమందారా!

తందానా

సాగర శయనా సమహిత చరణా శంఖగదాధరా!
శ్రితజన రక్షకుడవంచు విని నే సేవింపమది నెంచి
తనభక్తి శ్రద్ధలను మీరంగ నే తద్దయు నరుదెంచి
తారకనామము పరశివయోగము తత్వమే తెలియక
వీరగురుమూర్తి నీపదసేవల విరివిగ సలుపాక

పోవను నాతండ్రి దయనుచూడుము బోవుమునా రేడ;
నీవే తల్లియు దండ్రియు గురువని నెరనమ్మి యున్నాడ.

వ॥ అని ప్రార్థించుచున్న సిద్దయ్యయందు జాలి గల వాడై బ్రహ్మముగారతనిని శిష్యునిగ జేర్చుకొనిన నాతండును

మూడవఝామున ముందుగ లేస్తడు తందానా
వీడక సద్గురు వేగ జపిస్తాడు తందానా
కాలకృత్యంబులు కాంతు తీరుస్తాడు తందానా
విభూతి రేఖలు వేడుక పూస్తాడు తందానా
రుద్రాక్షమాలలు రూఢి ధరిస్తాడు తందానా
బ్రహ్మేంద్రస్వామిని భక్తి భజస్తాడురా తందానా
దేవనందనానా

వ॥ అవ్విధంబున ననుదిన మనుపమ వినయగుణమణి యననగు సిద్ధనిగని మనమున కనికరించి గురువు నను రాగంబున.

పంచాక్షరీ మంత్రంబురా - సై
అష్టాక్షరీ మంత్రంబురా - సై
ద్వాదశాక్షరీమంత్రంబురా - సై
సర్వశాస్త్రమర్మంబులో భళాభళానోయి తమ్ముడా
మేలుభళానోయి దాదానా

అండపిండాండ క్రమంబురా - సై
నాదుబిందు కళాతీతంబురా - సై
ఆశ్రిమంపు ధర్మాలురా - సై

అన్నింటిని బోధించాడో భళాభళినోయి తమ్ముడూ
మేలు భళానోయి దాదానా

వ॥ అలా శిష్యబృందములతోగూడ నా స్వాముల వారు సిద్ధవటం నవాబు - కడప నవాబు - కర్నూలు నవాబులవద్దకు పోయి గౌరమరియాదల నందిరారు.

వంత;-వ॥ ఒరేయ్! అన్నివిషయాలు చెప్పకపోయినా స్వాములవారి కొక నవాబువద్ద జరిగినదానినన్నా విని పించరా!

కథ:-వ॥ సిద్ధయ్యగారిలా బ్రహ్మంగారివద్ద నుండుటచేత వారి తలిదండ్రులయిన ఆదంబీ పీరుసాహెబులు కడప నవాబులవద్దకుబోయి మహమ్మదీయులను హిందువులుగ చేయుటానికై కమసాల బెమ్మం మన సాహెబును మోసంచేత శిష్యుడుగా చేర్చుకొనినారని నేరారోపణచేశారు.

వంత;-వ॥ అయితే మీరిక్కడనే వుండండిరా! నేను పోయి యిదంత అబద్ధం. బ్రహ్మంగారిదేమీ తప్పులేదని చెప్పి వస్తా?

సహా:-వ॥ అరేయ్ సన్యాసీ! వాళ్ళందరు యిపు డెక్కడున్నారురా? అదీకాకుండా నీవుచెప్పే సమాధాన మానాడు సిద్ధయ్యగారే చెప్పారు.

వంత;-వ॥ ఎలాగాచెప్పాడో యిలాగా చెప్పరా!

కథ;-వ॥ అపుడు నవాబుగారు కోపంతో నాజ్ఞాపించగ నిరువురు భటులుపోయి కంది మల్లయపల్లెలో నున్నయ్యను

భంధించుకొనివచ్చి రాజుగారిముందు నిలువబెట్టగా తానీషాగా రపుడు సింహగర్జనలు చేయుచు "ఏమిరా! నీవు మహామ్మదీయు డవై హిందువుల గురువును సేవించబోయావట నిజమేనా?

సహా;-వ॥ నిజమే మహారాజా!

కథ;-వ॥ ఆ –

అగరే యేమనుచుంటివిరోరీ హాస్ధావద్దూ లేక
నరనాథుండను ననుచూచియు నమస్కృతి యనక
భయమూలేదూ భక్తియులేదూ ప్రభువుల దరిగూడ
నయముగ పేదగురువు గొప్పంతయు నాకడ బలుకాడ
ముక్కలుముక్కలు చేయింతునునిను మొనకత్తులె త్తించి
ఉక్కుశూలంబుల గుచ్చుచు నిన్నిక నూరకసాక్కించి
సలసలకాగే తైలభాండంబున చయ్యన ద్రోల్లించి
కళపెళ వేగిన నీ మాంసంబును కమ్మగ వండించి
కాకులు గ్రద్దలు కుక్కలునక్కల కబళంబు వేయింతు
బోళరించిన నిన్నెట్టులైనా షాగరే నడగింతు.

వ॥ అని హుంకరించుచుండిన రాజునుచూచి సిద్దయ అయ్యా! నవాబేంద్రా! నా నమస్కార ప్రభావ మేమిటో నీవు నిదర్శనంచూడాలంటే పెద్ద నల్లరాయి నొకటి తెప్పించండి.

సహా;- వ॥ సిద్ధాయా! అదిగో నల్లరాయి నీమహాత్యం చూపించు.

కథ;- వ॥ అలాగేనని సిద్ధయ భక్తితో చేతులు జోడించి కన్నులుమూసి త్రికరణ శుద్ధిగ

గోవింద మాంబికా ప్రాణపతి కొనుమయ్యా నానుతీ
భావించినాను నామదినిన్నె భక్తిజెలగు రీతి
నీనామస్మరణమో సురవందిత నిఖలపావ హరంబు
మానిత నీరూపమే నామదిలో మారని తేజంబు
అజ్ఞానుల సుజ్ఞానులబ్రోచే యధిపతి నీవయ్యా!
అజ్ఞానుల కండగనుండే నృప శేఖరుడవయ్యా
నీమహిమ నెరుగఁజాలని రేడూ నిందించు చున్నాడు
పామరుల తప్పులెంచక మహిమా ప్రకడించు మీవాడు
భూషణ దూషణములెన్న బోవని పుణ్యుండ వోదేవ
పాషాణమును బ్రద్దలు చేయుచు పాలింపగావ!

వంత;- [అదరిపడి] ఆగండి - ఆగండి!

సహ:- వ। ఏమిత్రా నీకీభయం?

వంత;- నీకథా వద్దు గిథావద్దు యింటికిపోదాం పదండి.

సహ;- వ॥ ఎందుకూ;

వంత;- వ॥ పిడుగులు పడుతున్నాయిరా! పిడుగులు అమ్మో! ఎంతమోత - ఎంతమోత?

సహ;-వ।। పిడుగులుపడటం కాదురా? పిండ పగిలింది. సిద్దయ్యగారుచేసిన నమస్కార ప్రభావమునకు రాజుగారు తెప్పించిన నల్లరాయి పగిలిపోయి అలాంటి ధ్వని కలిగిందిరా! సన్యాసి.

కథ;-వ|| అప్పుడా నవాబు సిద్దయ నాలింగనముచేసి కొని సంతోషమున

భళాభళానోయి సోదరా! భళాభళానోయి
సలాంసలాం నీకీ కర్తాహుం సలాముఠాభాయి
వరశిష్యుండవు నీ ఘనమీావిధి వర్ధిల్లె ధరలోన
ధర బ్రహ్మేంద్రుని మహిమంబులింక దనరారునెంతైన
మూఢచిత్తంబున నే నిందించితిని పుణ్యులయినమిమ్ము
రూఢి క్షమాపణగోరితినయ్యా రోయక ననునమ్ము
మీా గురుచంద్రాసి మా నగరమునకు మేలుగగొనిరమ్ము
యోగివేణ్యుని మేమునుతింపగ మేలుగ దయనిమ్ము.

వ|| అని బ్రహ్మముగారిని రమ్మని కమ్మను వ్రాయించి కానుకలతో సిద్దయ్యను కంది మల్లయపురమున కతి వైభవముగ ననిపిన శ్రీ స్వాములవారు సిద్దయ్యగారి కోర్కెను మన్నించి సపరివార సకుటుంబ సమేతముగ నవాబుగారి పురి చేరిరి.

అచట తానీషావారందరు సేవించినపిదప కోరిన ప్రకారముగ స్వాములవారు కాలజ్ఞానమిట్లు వినిపించిరి.

పర దేశంబుల రాజులు కొందరు పాలింతురీ మనభూమి
మరయంత్రంబులతోడ జయింతురు మనవారి రణభూమి
మిట్టాపల్లము లేకములయ్యే మేటిచిత్రమందే
కట్టాయని ప్రజ లల్లాడిపోయే కాలమదిగనండీ
ఉత్తర దేశాన యుత్తమగాంధీ యుదయించుతాడండీ

వొత్తుగ కలములన్నింటిని తానొకటి చేస్తాడండి
ఆనుమతము లొక్కటౌతాయి అపరంజిపోతాది
యేసులై రక్తము నేకధారగ నేలపైనపోతుంది
ఉప్పుగుండూరు చెరువులోనా ఉత్పాదములుపుట్టు
మెప్పుగ బినగాన్పల్లెకు నెంతో మేటిభోగముపట్టు.

వ॥ ఇవ్విధంబున ననేక భవిష్య వాక్యంబుల దెలిపిన నాతనికి నమస్కరించి నవాబు "అయ్యా! మీరు సర్వమతము లందు సమభావము కలవారుగదా మా యొసగు నాతిథ్యమును స్వీకరించి మము ధన్యులజేయుడని కోర బ్రహ్మము గారా రాజేంద్రుని తాంత్రికమును మనంబున నెరింగియు పైకి నేమియు ననక చిరునవ్వున నంగీకరించి, హిందూ మహమ్మదీయులను భేదములేకుండ నేకపంక్తిని కూర్చుచుండిరి.

అంతట రాజేంద్రుడు మనంబున నానందమును చెంది
సంతసమున పాకములన్నింటిని సమకూర్చె రయమొంది
హిందూ మహమ్మదీయులను భేదమెరుగక చేరి
రందరొక పంక్తికి భోజనంబుల నారగింపగ గోరి
తానీషా చేయించినవాటికి తడయక తెప్పించె
మానక నందరిముందర విందులు మరిమరి వడ్డించె.

వ॥ ఆ సమయమున

చ॥ అల మొగలాయివంశ మరియాదఘటించి మునుంగు వేసిపూ
జ్యులకిడు భోజనంబులను చూడకె మాంసమటుచెరింగి తా

నలుక వహింపబోక మహాత్ముడు తోయముజల్లి మాధురీ
ఫలములునయ్యె నవి — వారటు వారలు వింతమొందగన్.

వ॥ అదిగాంచి నవాబు స్వాములవారి పాదములమీద బడి మహానుభావా! నన్ను రక్షింపుము, మీరు మహాత్ములని విశ్వసించితిని. హిందువుల కాపు పవిత్రమయినది. మే మద్దానిని భుజింతుము. ఇచ్చిన సాతిథ్యమును పుచ్చుకొనుట యుత్తమ లక్షణంబగుటచే మీరీ గోమాంసమును భుజించి నచో తమరు ఖురాను మతమునకు చేరినట్టులు మా అల్లా మెచ్చునని యిట్లు వేసితిని. వేరుకాదు. కాన నన్ను మన్నింపుమని ప్రార్థించిన నా మహనీయుండు నగవుచు వత్సా!

ఉ॥ మానవసేవయే ధరణి మాధవసేవ అనేకపేరు ల
వ్వానివి సర్వశాస్త్రములు వానికిజూడ సమానభావముల్
కాన, మతాభిమానమున కట్టడిబెట్టి మరొక్కజీవి దె
ద్దాన బలాత్కరించుట వృథావ్యథగాక ఫలంబుగల్గునే?
[కవిగారి ప్రత్యేక రచననుండి సేకరణ]

వ॥ అని దెలిపిన కడప నవాబు బ్రహ్మంగారిచే జ్ఞానోదయమంది స్వామీ నన్ను మీ శిష్యునిగ జేర్చుకొనుడని ప్రార్థించుచు శ్రీ స్వాములవారి మఠంబులో తన పేరునచేయు సేవ వార్షికముగనుండుటకు నేడు కుచ్చెలుల మాన్యమును వ్రాయించి యధికారముద్రికలతో నొసంగిన బ్రహ్మంగారు

మణులు మాన్యములన్నియు నాకు మమతలుగావయ్యా
అన్యమతద్వేషము సేయవని నా కభయంబు నిడుమయ్యా

హిందూ మహమ్మదీయులముంటిమి హిందు దేశములోని
పొందుసుఖము పోనష్టము పొందించు మనకైన
భారతీయుల గారవింతునని వాగ్దాన మొసగును
భారత ముసల్మానుల నొకరీతిని బాలించెదననుచు
హైందవమతమున కే యిక్కట్టుల నాచరింపననుచు
ఇందరిలో నా మాటకు సమ్మతి నిప్పుడె యొసగుము.

వ॥ అని కోరిన శ్రీ స్వాములవారి యభిమతము ననుస రించి భారతీయులనుగూడ మహమ్మదీయులతోపాటు సమాన గారవములతో గారవింతునని తానీషాగారి వాగ్దానము తీసి కొని యా మతోద్ధారకుండు పయనంబై రాజమర్యాదలంది అల్లాడుపల్లెలా వీరభద్రాలయమునుచూచి అన్నాజయ్యనుపలు కరించి పుష్పగిరిమీదుగ కందిమల్లయపురమున కేగదలంచి యొకవనంబును జేర నందొక్క దిక్కులేని యిల్లాలు స్వాముల వారి పదంబులబ్రాలి దుఃఖించుచు

పట్టితినయ్యా నీ పదములనే పరమ దయానిధీ
గట్టిగ నా తాళి నిట్టులైనను కావు కరుణావిధీ
కుష్ఠురోగంబడి పీడించుచుండగ కుందెడు ప్రతివేళ
శిష్టపాలకా వారి కారోగ్యముచెందింపు మివ్వేళ
పొక్కులు పులిసీళ్లు దుర్గంధంబు పూర్తిగనుండంగ
అక్కట చూడగ లేకుంటినతని యండనే నుండంగ
సతికి పతిని మించిన దైవములేదు జగతిలోనె చక్కైన
పతితపావన దయామయుడవై పావింపు మెటులైన

వ॥ అని ప్రార్థించిన స్వాములవా రామెను కరుణించి నాతని కమండలములోని మంత్రజలంబుల నామెభర్తను పుచ్చుకొమ్మని నంతనే తొలికుష్టు వ్యాధిమాయమై వజ్ర దేహుండగుటచే నాదంపతులా మహనీయు ననేక విధంబుల గొనియాడిరి. వారంత పుష్పగిరిని చేరుచుండ వీధియందుగు మీాద సభదీరినవారిలో పెద్దవారు నివారించు చున్ననూ కొందరు దుండగీండ్రు వినక స్వాములవారి కడ్డువచ్చి—

చాలును చాలును పోపోవయ్యా సాహెబుల గురువ
మేలా బ్రాహ్మణ వీధిని నీవిటు మేటినని నడువ
అడిగినదానికి బయలువచింపక నడుగడ బూనిన
చెడిదెవ్వసుమీా నాదుహితంబును చెవిబెట్ట కుండిన
కనకమును హరించు కులంబగు కమసాలివీ వేడ?
ఘనముగ గురుపీఠంబుల తోడుత కదిలివచ్చు టిదేడ;

వ। అనిపరిహాసించుచున్న పుష్పగిరీ యగ్రహారికులతో వీరబ్రహ్మయాచార్యుడను సంతలము నాగ్రహమందక నయ్యలారా! మీాకిది న్యాయమా?

సీ॥ సర్వసముండైన శౌరిబిడ్డలలోన
కులమత ద్వేష సంకులతలేల?
మాంస భక్షణరోసి మానసయోగము
జేసి వేదవిధుల జెందుమనకి
దేల? నియోగ, వైదిక, విశ్వ, మధ్వాది
బ్రాహ్మణ వాదవివాదమేల?

యెడు బ్రహ్మజ్ఞాన మెరుగు నాతండె, బ్రా
హ్మణుడంచు మీరింత మరువనేల?

గీ॥ ద్రోహికైన కీడెంచని దొడ్డవాడు;
లేశమైన మదిని కక్ష లేనివాడు
బ్రహ్మజాత కుండని వేదభావమైన
నెన్నగానేల నీరీతి నన్నలార!

[కవిగారి ప్రత్యేక రచననుండి సేకరణ]

వ॥ అని సౌమ్యమున దెలిపిన మహినీయుని లక్ష్యంబు సేయక, వారు—

రువ్వండి రువ్వండి కోనురాలను దువ్వంగ రారండి.
గవ్వకు కొరగాని గురువు నీతులు గరపునామాకండి.
తురకోడువారు శిష్యుడై ముందు దొరకొని నడువంగ
పసువులేని యీ కమసాలి గురుపై పయనంబు సేయంగ
కొట్టుడిరోరి యీమాయా గురువుల గురిచూచి రాలతో
పట్టు నవాపురి జనులు రాలను వైచిరి దీక్షతోడ

వ॥ అన్న నిరంకుశమును నిజగురువుగారి పరాభవమునకు సహింపలేని సిద్దయ్య రూక్షేక్షణములతో జూడగ పుష్ప గిరి యంతయు నప్పటి కప్పుడే నిప్పంటుకొని—

పెటేల్ పటేల్‌మని బొంగులన్నియు ప్రేలుచున్నవి బాబు
చెటేల్ చెటేల్‌మని పెంకులన్నియు చాలచేలె చెను బాబు
గుప్ గుప్‌మని కారుపొగలెగలి గుప్పించె మరి బాబు
భగ్ భగ్‌మని మంటలాకసమంట బాగ లేచెను బాబు

తల్లీ పిల్లలు వేరై లబలబ తల్లడిల్లిరిబాబు
గొల్లుమనే రోధన లాపురిని కొల్లలయ్యెనుబాబు
పైకెగసె మంటలనుండి దొలగి పరుగెత్తిరటు బాబు
కాకిశ్శోకము క్షణములోనా కల్గెవింతగబాబు

వ॥ అదిగని నాయూరివారు స్వాములవారిని మన్నింప ప్రార్థించినవేళ దయామయుడైన నమ్మహాత్ముడు.

గీ॥ దైత్య గీర్వాణులంబ్ధిని తరచువేళ
నుద్భవించు విషజ్వాల నొక్కకేల
బట్టి మ్రింగిన హరుబోలి బ్రహ్మమంత
భీషణానలంబును మ్రింగి వింతదోప.

వ॥ అట్లు పుష్పగిరి బూదిపాలు కాకుండ కాపాడిన స్వాములవారి పదంబులనుబట్టి క్షమాపణ కోరినపిదప మరియు స్వామీ మీరచిత కాలజ్ఞానంబున కొద్దిభాగంబు వినిపింపుడని కోరుటచే నతండా

కరువులు కాటకములు ముందికను కలుగును నిజమండి.
నరుకక యేనాగజముడు గొట్టలు నశియించునిలనండి.
యేడూళ్ళకిల నొక్కయూరగుట నిలపైన గనరండి.
యేడుకాపురాల కొక్కకాపురంబు సీమహీనగునండి
వెంపలచెట్లకు దోటీలువేసి విజ్ఞానులు మరండి
కొంపలు గూల్చుచు కబురులుచెప్పె గురువులు ధరనండి
యింటింట కలహంబులు యెంతైన యేర్పడు కాయండి
మంటలు నిప్పులతో వర్షంబులు మహినండి నికరియు

నదులు పొంగుతాయి గ్రామాలు నాశం మౌతాయి
చదునుగ భూభాగము యికముందు జలలో మునుగుతాయి
తల్లికితల్లీ పిల్లకుపిల్లా తల్లక్రిందవుతారు
యిళ్ళూ వాకిళ్ళూలేకా వూళ్ళకెళ్ళి తిరుగుతారు.
ఆరెదొండ తీగెనామరమున కడ్డమై వస్తుంది.
ఆరాధనమూడు రోజులటునా కంతమైపోతుంది.

వ॥ అని దెల్పిన వారంద రానందించిరి. అనంతరమున నొకనాడు బ్రహ్మంగారు సిద్దయ్యగారికి షడ్చక్ర విధానంబును దెలుపుచుండు మాదిగ కక్కయ్య చాటుననుండి విన్నవాడ గుటచేత నాతడమాయక భక్తుడై —

మరుగువ దేవతలందరుకూడా మనలో నున్నారా
కరకర కత్తితోవానిని గోసియు కాంతును కన్నారా
అనుచు నింటికిబోయి కక్కయ్య అతివేగనుతోడ
తనయిల్లాలును బట్టి వధించెను దైవములను జూడ
చీముయు నెత్తురు మాంసము నెముకలు చేటెడు పేగులు
యేమూల దేవులు లేరని పడె తానెంతయు దిగులు
అయ్యయ్యో మాయగురువు మాటలనాత్మ నెంతను నమ్మి
వయ్యలు వయ్యలుగా గోసితినే బాకునవడి నమ్మి
పండంటి నాడుభార్యను కాస్తా పరలోకముతీపి
నిండైననాదుసంసారంబున నిర్మూలమే నైతి
కొంపలుముంచే దొంగగురువా కులుకుచున్నావ
దుంపదెంచి నిను గంపకెత్తక తోలుతవిడుస్తానా
అరరే ఒక్కొయేటున నీతల నంటనీగా చేత్తా

చెరువున నీతోలూనా చెట్టి సెప్పాలు కుట్టేస్తా
అనుచు గ్రుడ్లను పెద్దవిగజేసి యోంబోతులాగున
పెను క్రోధంబున పైబడ నురికె పెద్దపులిలాగున

వ॥ అట్లతిరోషంబున పైకురుకుచున్న కక్కయ్యను సహజ కరుణామూర్తి దగ్గరకు పిలిచి నాయనా! కక్కయా! సిద్ధయా మీరిరువురు నాకుశిష్యులే కావున మీకు దివ్యదృష్టి నొసగుచున్నాను. మనశరీరములోని చక్రము లారింటిని వాటి కదిధి దేవతలను చూపుచున్నాను చూడుడు.

సీ॥ ఆధార చక్రము నందు విఘ్నేశుండు
నాల్గుదళంబుల వెల్గునదుగో
స్వాధిష్ఠచక్రాన చతురాశ్యుడింపార
నారుదళంబుల నలరునదుగో
మణిపూరకంబున మాధవుండచ్చోట
పదిదళంబులతోడ గదియు నదుగో
అలయ నాహితమందున నలాక్షు డచ్చోట
పదిరెండు దళముల బరగునదుగో
గీ॥ షోడశదళాల జీవి విశుద్ధమదిగో
అమరనాగ్నేయ చక్రంబునందు నాత్మ
దళయుగంబు నదిగో! వేయిదళము లందు
సద్గురుండొప్పు నోంకార శబ్దమదిగో.

వ॥ అది తెలిపి మరలవారిని దివ్యదృష్టినుండి మరలించి కక్కని భార్యను బ్రతికింప వారాయన పాదముల వ్రాలిరి.

వం॥;- వ। మోసం- మోసం! [అని వ్రేళ్లు లెక్క బెడు తుంటాడు]

సహ:- వ। ఏమిట్రా నీగొడవ!

వంత;- వ॥ ఉండుడు నాలెక్క తేడా వచ్చింది. మన వాడు ఆరుచక్రాలన్నాడు. బ్రహ్మంగారు కక్కయ్యా వాళ్ళకు చూపింది యేడు చక్రాలు లెక్కవచ్చింది. యీ తిరుగుడు నా లెక్కలో వుందా? నీకథలో వుందా?

సహ:- వ। ఆ తేడా మనయిద్దరిలోనులేదు. నీ సందే హం నిజమే. నేనుగూడా యీ విషయం చాలామందినడిగాను. ఇంకా తెలియలేదు. తెలిసిన తరువాత చెప్తానుకాని మిగతా కథ పూర్తి కానివ్వు.

కథ;- వ। కక్కయ్యగారు స్వాములవారి నతిభక్తితో.

అపరాధం బొనరించితినయ్యా అనుకంపగనుమా
అపకారుల కుపకారము చేసెడి అనఘమూర్తి వినుమా
జగతిని భోగము లెన్ని లభించిన శాశ్వతములుగావు
సుగుణ భరిత సుస్థిరంబగు నెద్దియొ చూపుమిత్తరి నీవు
భక్తవరదుండవు పాపవైరివి పాలింపు మమునింక
ముక్తి యొసగుమ మునికులాధిక పోలుపారు నెలవంక

వ॥ అని కోరిన కక్కసి భక్తికానంద మంది సద్గురుండు

గీ। కందిమల్లయ పరమందు గలమఠాన
మోజునింపు మేళము లెన్ని మోగుచున్న

ముందు నీకన్న తప్పేట మోగునయ్యా!
కక్క! శాశ్వత మిద్ది నిక్కంబుగాను.

[కవిగారి ప్రత్యేక రచననుండి సేకరణ]

వ॥ అని యాశీర్వదించిన పిదప స్వాములవారింటికి పోయిన మరికొన్ని నిదర్శనముల గూడా చూపించిన యనంతరమందొక శుభముహూర్తంబున స్వాములవారు సీఠాధిపత్యమును తన పెద్దకుమారుడయిన గోవిందాచార్యులవారికి పట్టాభిషేకము సేయ సమస్త బంధుమిత్ర పరివార శిష్యబృందముల కాహ్వానము లంపిన.

నందికొండ ప్రజలందరు వచ్చిరి తందాన తందాన తందాన
హరిపుర జనులందరు వచ్చిరి తందాన తందాన తందాన
బనగాను పల్లెలో భక్తులువచ్చిరి తందాన తందాన తందాన
పెద్దకొమెర్లపురజనులు వచ్చిరండోయి తందానా దేవనందనాన
కడప కర్నూలు ప్రభువులు వచ్చిరి తందాన తందాన తందాన
పుష్పగిరీ బ్రాహ్మణులు వచ్చిరి తందాన తందాన తందాన
చుట్టుపట్ల గ్రామాలవారలువచ్చిరి తందాన తందాన తందాన
కందిమల్లయ పల్లెచేరిరండోయీ తందానా దేవనందనాన

వ॥ అట్లా పట్టాభిషేకం లతివైభవముగ వేదవిధి విధాయకముగ జరిగినపిమ్మట నా వీరబ్రహ్మముగారు వచ్చిన వారందరిని చూచి అయ్యలారా! వచ్చే దశమినాడు నేను సమాధి కాబోవుచున్నాను. ఈ పట్టాభిషేకమునకు వచ్చిన వారంద రంతవర కుండవలయునని దెలుపుచుండ గోవిందయా

చార్యులుగారు తండ్రికి నమస్కరించి నిలువంబడి తండ్రీ!

చ॥ అరయుగ దివ్యభాష! మహితాత్ములు మీకు సమాధి నొందనే
ఎరుగని చిన్నవాడ నెటులీగురుపీఠము జూచువాడ? నో
పరమదయానిధీ! పతితపావన! భక్తిజనైకపోషణా!
ధరణిని నాదుకార్యముల దర్పమొసంగి యెసంగ దెల్పుమా!

వ॥ అనికోరిన వీరబ్రహ్మముగారు చిరునవ్వు నవ్వి, నాయనా! గోవిందయాచార్యా! భూలోకంబునకు నేనువచ్చిన పని పూర్తియైనది. ఇక నే నాలస్యము చేయరాదు. అయినను నీవు విచారింపకుము. నీ గర్భంబున నుదయించు నేవురు కుమార్తెలలో యీశ్వరమ్మ, జగదీశ్వరి వోలేజ్ఞానేశ్వరి కాగలరు. మీ కవసరమయినవాటిని – నేను మిగిల్చినవాటి నామె పూర్తిచేయగలదని సమాధానపరచిన తర్వాత సిద్దయ్యతో నాయనా సిద్దా!

చెలువుగ రేపు సమాధిని తప్పక చెందగ నేనుంటి
విలసితంబుగ పూలగొని రాగా వెడలుము నీవంటి
గోవిందయ పట్టాభిషేకమున కూడినవారంత
సందడిగ సమాధిగాంచుట సంతసము మరింత
తప్పక నీవు సమాధి వేళకు తరలిమరలిరమ్మా
చెప్పిన నా మాటలు మరువక శిరమున నిడుకొమ్మా

వ। అని యాజ్ఞాపించినటుల గురువుగారి మాటలు శిరమున దాల్చిన సిద్దయ వేకువ ఝామముననే నిదురలేచి పూల కేతెంచెను. ఇచట క్రమముగ సమాధివేళ సమీపించు

చున్నది. సిద్దయ్యా రానందుల కందరూ తహతహలాడు
చున్నారు. సమాధి నిష్ఠాప్రవేశ సుషుప్త్యార్తము దాటి
పోవు చున్నందున శ్రీస్వాములవారు అచటనున్న వారిలో
ప్రధానమయిన వారిని పిలిచి సిద్దుడు వచ్చిన తరువాత మీ
రాతనిని సమాధివద్దకు రానీయకుండ నాటంక పరుచుడు.
దానవాతండు తనభక్తిని ప్రకటించిన పిదప నాసమాధి వద్దకు
రానిండని వచించి యీ మహనీయుండు నిర్ణీతకాలంబున జీవ
సమాధి నొందిన నందున్న వారందరూ కరములుమోడ్చి—
కన్నులు సగంబులుగ మర్తాసి- మనసుగురిచేసి.

శా;- లీలామానుష విగ్రహా! ప్రణవ కేళీలోల! దోషానల
జ్వాలాభంగ దఖండ శ్రోయఘీరరూపా! పుణ్యాలోకేశ్వరా
కాలజ్ఞాన పవిత్ర కావ్యరస విజ్ఞాన ప్రభాపూర్ణ; గో
పాలా! భవ్యతపః ప్రభావచరితా: పాహీం, శుభం భావుకా

[కవిగారి ప్రత్యేక రచననుండి సేకరణ]

వ॥ ఇచట నిటులుండ సిద్దయ్య వనంబుల కుంబోయి గురువుగారి నర్చించుటకు దేవదారు పూలకై వెతకుచుండిన నందెచ్చటను కానరాక యుండుటచే

ఎంత వెదికినా కోరిన పూలూ యెచటేసియు లేవు.
వింతగ నున్నవి కానీ ఘుడియము వేరేటియునుగావు.
మాగురుదేవు పదపూజాళికి మదిలో గలపూలు
ఆగమ వేద్యుడుగోని రమ్మని, నాకాజ్ఞ నిడినపూలు
పూలకయినేను మరినాదీక్షను పుట్టలు వెతికిన
వేళకు నందక భయమేర్పడెను వేగిరముపడిన

యెటుబోవుదు నేమిసేయుదునే నెఃరిని కోరుదు
యెటుబోయిన సుమంబులు లేవు యిఁకేమి సేయుదు.

వ॥ అని చింతించు చుండిన సమయంబున వానికొక భూసురుండు కనుపించి ఓయీ! సిద్ధా! దేవదారు పూలు నీకు దొరకలేదా? మీ నాయనగారి సమాధివేళ యతిక్రమించు చున్నదని చింతించుచున్నావా అటులయిన నేదెలుపు హిత ప్రసంగమును శ్రద్ధతో వినుమని యిటుల నెను.

ఘోరపాపంబుల భరింపలేక ఘోషించి భూకాంత
సారసాక్షునితో మొరలిడియెను జరిగిన గతినంత,
కరుణామయుడై భూభరమడంప కమలనయను డంత
సరసిజభవ సాంబసదా శివులను స్మరియించె నలుసంత
కలిభారము దీర్పగ నాముగ్వురు ధర్మసలిబుట్టిరి
విలసిలముగశ్రీ విష్ణువరయగ వీరయోగియనిరి
అలవలుకుల సతిభర్త జనించె నన్నాజి యనుబాబు
పులితోలుగల కైలాస వతివి పొడమితివిబాబు

వ. కావుననీ యుపాయంబును వినుము.

సహో:- సెలవిమ్మ మహాత్మా!

కథ:- వ॥ మీ గురువుగారు శ్రీమహావిష్ణువు. నీవాది శంకరుడవు. కాబట్టి కళ్లుమూసికొని ముళ్లులేనియాకు మూడు గుప్పటలుకోసి నీవడియందుంచు కొనుము. అటులయిచో నా పత్రములు మీ గురువుగారి ప్రభావంబున నీవన్వేషించు సుమంబులు కాగలవని దెలిపి యదృశ్యుండయ్యెను. అంత,

గీ॥ గురు నెద దలంచి: సిద్దయ్య మాదుపరులు
ముళ్లు తీని యాకులుగోసి మూటగట్టి
కొలను దరినుంచి స్నానంబు సలిపిరాగ
దేవదారు పుష్పములయ్యె తిరిగిపత్రి

వ॥ అదిచూచి సంతోషంబున సిద్దయ్య తిరిగి యింటికి రాజూచుచుండ మార్గమధ్యంబున నొకకాలువ యకారణముగ నుప్పొంగి దాటుటకు వీలుగాకుండిన పరిపరి తెరంగుల పరితపించి తుదకేమియును చేయజాలక మనసు గురుమూర్తి యందు లగ్నమునుచేసి చేరుదునా కందిపల్లయ పల్లెచేరుదును లేదా? యిదేమరణింతువని తుదినిర్ణయము చేసికొని యఘాతనుయిన నా కాలువ యందు దుమికెను.

భళిభళిరా అదేమిచిత్రమొకాని బాపురే యనంగ
యిలపైనున్న జలమెంతో మారెను యినుకదిబ్బనంగ
పరమానందంబున సిద్ధుడపుడు పరుగెత్తి చనినాడు
బిరబిర గురువాశ్రమంబునకు వెళ్ళి నిలిచినాడు
పరివారము లేదల భక్తులు లేరు బాంధవులును లేరు
అటచూచిన సిద్దయ గుండెలు ఆగిపోయాయండి
ముదమున సమాధి జరిగెనంచును ముందెంచె నతడండి.

వ॥ అపుడా సిద్దయ్య యనేక తెరంగుల మొరలెత్తు చుండగ గోవిందమాంబ గవాటములోనికి వచ్చి "సిద్దా! సమాధివేళ యగుటంజేసి శ్రీ స్వాములవారు నిష్టలో ప్రవేశించినారు. నీవు వచ్చినచో యింటికి పొమ్మనమని నీకు చెప్పు

నదిగ మూకు సెలవిచ్చినారు. నిన్ను లోపల సమాధికడ కేనియు రానీయవలదనినారని ద్వారములు బంధించి తిరిగి పోయెను. ఆ సమయంబున సిద్దయ్య —

అయ్యయ్యో దైవమ యిదేమి అన్యాయమో యయ్య
నెయ్యముతోచు నన్నేటికి నిరశించినావయ్య!
కలలోనైనా మీ యానమీరిన కలుషాత్ముఁడగాను
యిలలోనైనా మీ మాటదాటిన హేయబుద్ధినిగాను
పూలకుపోయీ వేళకు రాలేకపోయిన దుష్టుడ
జాలితో మన్నింపుమయ్యా నను సద్గురు దేవుడ
మన్నింపుమన్న నీవు వినుమయ్యా మహిమీదనే వుండ
కున్నారా నీ రూపుగాంచక నేను గతియింతు నీదండ
గండకత్తెర మెడనైచుకొని నే ఖండింపబడనుంటి
దండీగ యీ యపవాదు నీకిక తప్పదు వెన్నంటి
సిద్ధునిపై పగేటికి నీవిలచెందినాడవు తండ్రి
సుద్దులేటి కింక గండకత్తెరలివె చూడుము నాతండ్రి

వ|| మరణింపనెంచి గండకత్తెరలు మెడకు వేసికొన బోవగ

పెళపెళధ్వను లావేళ వింతగ పృథివిమీదను బుట్టె
కళవరమౌ ధ్వను లాలించుజనుల కంలించి మదితట్టె
వాని చల్లని కన్నులచూపులు పండువెన్నెలలండి
వానినెమ్మొని చాయూ లెంతైన పసిడి తేజములండి
బాలభానుడు ధరణిమీదకు తావచ్చెనె మొనసంగ

జాలిగుండెల జేజినాయనా వే సమాధి వగులంగ
వచ్చినిలుచుండె వేగ సిద్దునిపాలించు కతమున
వచ్చిన గురుమూర్తికి నా సిద్దయ భక్తిహృదయంబున
సాగిలబడి నమస్కరించి వివిధసన్నుతుల నొనర్ప
బాగుగ నాలింగనమును జేసె బ్రహ్మము మదిజేర్ప

వ॥ నాయనా! సిద్దయా! నిర్మల జ్ఞానసంపూర్ణుండ వయిన నీకు నా యోగదండము - పాదుకలు మున్నగునవి నీయ సంకల్పించితి. తీసికొమ్మని ప్రసాదించి మరియు సిద్ధా! నీవు సిద్దుడవైతివి: కడసారి నా యాజ్ఞ వినుము.

తడయక నీవు యింటికిపోయి తలిదండ్రులగూడి
వడతిని వివాహమాడి సుఖించు భార్యపిల్లలతోడ
నావలె సమాధి నీకందొకటి నయముగ సమకూడు
కావలె శిష్యులెందరో ధర ఘనముగ నినుగూడు
పోయినివ్వార సుఖంపుమోయయ్యా అందాలుచిందంగ
శ్రేయము నీకగు నాశీర్వాదము చేసితి ముందుగ
గురువాజ్ఞ మీరక రయమున నీవుగుణమూర్తి చనవయ్యా
మరల సమాధిని దే చేరుచుంటిని మరలిపోనగునయ్యా

వ॥ అని యాశీర్వాదమిచ్చుచు నదృశ్యమయిన శ్రీ మద్వీరా టోపొతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి పాదుకలను కన్నులకద్దుకొని భక్తితో తలయందుంచుకొని యింటికి పయనంబై గురుపత్ని, గురుపుత్రుల యనుమతిపొంది గృహోన్ముఖుడైన సిద్దయ్య—

వంత;- వ॥ ఒరేయ్! అయినవారి కాకుల్లో - కాని వారికి కంచాలలో పెట్టే బుద్ధి ఆ రోజులలో బ్రహ్మంగారికి గూడా వుందన్నమాట! కాకపోతే కడుపునబుట్టిన బిడ్డలకు యివ్వకుండా బయటనుండివచ్చిన దూదేకులవాడికి కటరా ఆ యోగదండము మొదలైనవి యిచ్చేది.

సహా:-వ॥ ఓరి సన్యాసీ! ఆయన నిర్వికారుడయిన భగవత్స్వరూపుడు. అది వారి మాయానాటకము. వారికి నునమంచ రము కన్నకుమారులమే. భగవానునికి భక్తియే ప్రధానము గాని బాంధవ్యముకాదు. బ్రహ్మంగారిపుడుకూడా భక్తజనవ శంకరుడే కావున నా భేదమూ మహాత్ముడెంచలేదు.

కథ:-వ॥ అంత సిద్దయ్య ప్రయాణముసేయుచూ

ధన్యంబుధన్యంబు నా జన్మధరణి ధన్యమయ్యెగదండి
అన్యుల కలభ్యమయిన యీ ముక్తియబ్బెను నాకండి
కరుణామూర్తిని నమ్మినవారలు కడు ధన్యులగునండి
ధర నావలె సద్గురువులనమ్మిన తరుగవు సిరులండి
నమ్మిభజింపుడా వీరనారాయణు నయముగ మీరండి
యిమ్ముగ కోరినకోర్కెలు కూడును యిలపైన మనకండి
మంగళమంచును సద్గురుమూర్తిని మదివిల్చి పిలువండి
మంగళం శుభమంగళం జయజయామంగళం మంగళం.

—: సంపూర్ణం :—